# అథ చత్వారింశోధ్యాయః

# అర్జున కిరాత సంవాదము

నందీశ్వర ఉవాచ|

సనత్కుమార సర్వజ్ఞ లీలాం శృణు పరాత్మనః | భక్త వాత్సల్యసంయుక్తాం తద్దృఢత్వ విదర్భితమ్ || 1

శివోఽప్యథ స్వభృత్యం వై ప్రేషయామాస స ద్రుతమ్ | బాణార్థే చ తదా తత్రార్జునోఽపి సమగాత్తతః || 2

ఏకస్మిన్ సమయే ప్రాప్తౌ బాణార్థం తద్గణార్జునౌ | అర్జునస్తం పరాభర్త్స్య స్వబాణం చాగ్రగ్రహీత్తదా || 3

గణః ప్రోవాచ తం తత్ర కిమర్థం గృహ్యతే శరః | బాణశ్చైవాస్మదీయో వై ముచ్యతాం ఋషిసత్తమః || 4

ఇత్యుక్తస్తేన భిల్లస్య గణ   న మునిసత్తమః | సోఽర్జునశ్శంకరం స్మృత్వా వచనం చ తమబ్రవీత్ || 5

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ సనత్కుమారా! నీవు సర్వజ్ఞుడవు. పరమాత్మ యొక్క లీలను వినుము. ఈ లీలలో భక్తుల యందు శివునకు గల దృఢమగు ప్రేమ నిండియున్నది (1). అపుడా శివుడు బాణము కొరకై తన అనుచరుని వెంటనే పంపెను. అపుడచటకు అర్జునుడు కూడా చేరెను (2). బాణము కొరకై శివానుచరుడు మరియు అర్జునుడు అచటకు ఏకకాలములో చేరిరి. అర్జునుడాతనిని గద్దించి అపుడు తన బాణమును స్వీకరించెను (3). అపుడా శివకింకరుడిట్లు పలికెను: ఓ మహర్షీ! ఈ బాణము మాది. నీవు దానిని ఏల తీసుకొనుచున్నావు? దానిని విడిచిపెట్టుము (4). ఆ భిల్ల ప్రభుని అనుచరుడు ఇట్లు పలుకగా, మహర్షియగు అర్జునుడు శంకరుని స్మరించి ఆతనితో నిట్లు పలికెను (5).

అర్జున ఉవాచ |

అజ్ఞాత్వా కిం చ వదసి మూర్ఖో%సి త్వం వనేచర | బాణశ్చ మోచితో మే%ద్య త్వదీయశ్చ కథం పునః || 6

రేఖారూపం చ పిచ్ఛాని మన్నామాంకిత ఏవ చ | త్వదీయశ్చ కథం జాతస్స్వభావో దుస్త్యజస్తవ || 7

అర్జునుడిట్లు పలికెను-

ఓ వనచరా! నీవు తెలియకుండగా ఏదియో మాటలాడు చున్నావు. నీవు మూర్ఖుడవు. నేను ఇప్పుడే బాణమును ప్రయోగించి యుంటిని. ఆ బాణము నీది ఎట్లు అగును? (6). దీని రేఖారూపము మరియు పిచ్ఛములపై నా పేరు వ్రాసియున్నది. ఇది నీది ఎట్లు అగును? నీవు నీ స్వభావమును విడనాడలేకపోతివి (7).

నందీశ్వర ఉవాచ|

ఇత్యేవం తద్వచశ్శ్రుత్వా విహస్య స గణ   శ్వరః | అర్జునం ఋషిరూపం తం భిల్లో వాక్యము పాదదే || 8

తాపస శ్రూయతాం రే త్వం న తపః క్రియతే త్వయా | వేషతశ్చ తపస్వీ త్వం న యథార్థం ఛలాయతే || 9

తపస్వీ చ కథం మిథ్యా భాషతే కురుతే నరః | నైకాకినం చ మాం త్వం చ జానీహి వాహినీ పతిమ్ || 10

బహుభిర్వనభిల్లైశ్చ యుక్తస్స్వామీ స ఆసతే | సమర్థస్సర్వథా కర్తుం నిగ్రహానుగ్రహౌ పునః || 11

వర్తతే తస్య బాణోయం యో నీతశ్చ త్వయా%ధునా | అయం బాణశ్చ తే పార్శ్వే న స్థాస్యతి కదాచన || 12

తపఃఫలం కథం త్వం చ హాతుమిచ్ఛసి తాపస | చౌర్యాచ్ఛలార్థ్యమానాచ్చ విస్మయాత్సత్యభంజనాత్ || 13

తపసా క్షీయతే సత్యమేత దేవ మయా శ్రుతమ్ | తస్మాచ్చ తపసస్తేద్య భవిష్యతి ఫలం కుతః || 14

తస్మాచ్చ ముచ్యతే బాణాత్ కృతఘ్నస్త్వం భవిష్యసి | మమైవ స్వామినో బాణస్తవార్థే మోచితో ధ్రువమ్ || 15

శత్రుశ్చ మారితస్తేన పునర్బాణశ్చ రక్షితః | అత్యంతం చ కృతఘ్నో%సి తపో%శుభకరస్తథా || 16

సత్యం న భాషసే త్వం చ కిమతస్సిద్ధిమిచ్ఛసి | ప్రయోజనం చేద్బాణ   న స్వామీ చ యాచ్యతాం మమ || 17

ఈ దృశాంశ్చ బహూన్ బాణాంస్తదా దాతుం క్షమస్స్వయమ్ | రాజా చ వర్తతే మే%ద్య కిం త్వేవం యాచ్యతే త్వయా || 18

ఉపకారం పరిత్యజ్య హ్యపకారం సమీహసే | నైతద్యుక్తం త్వయాద్యైవ క్రియతే త్యజ చాపలమ్ || 19

ఇత్యేవం వచనం తస్య శ్రుత్వా పార్థో%ర్జునస్తదా | క్రోధం కృత్వా శివం స్మృత్వా మితం వాక్యమథాబ్రవీత్ || 20

నందీశ్వరుడిట్లు పలికెను-

గణాధ్యక్షుడగు ఆ భిల్లుడు ఋషిరూపములోనున్న అర్జునుని ఆ మాటలను విని ఆతనితో నిట్లనెను (8). ఓరీ తాపసా! వినుము. నీవు తపస్సును చేయుట లేదు. నీవు తాపసవేషమును దాల్చియున్నావు. ఇది వాస్తవము కాదు. నీవు మోసగాడివి (9). తపశ్శాలియగు వ్యక్తి అసత్యమునేల పలుకును? నేను ఒంటరినని తలంచుకుము. నేను సైన్యాధ్యక్షుడనని యెరుంగుము (10). మా ప్రభువు అనేకమంది వనవాసులగు భిల్లులతో గూడి యున్నాడు. ఆయన దండించుటకు గాని, అనుగ్రహించుటకు గాని అన్ని విధములుగా సమర్థుడు (11). ఇపుడు నీవు ఇచటనుండి తీసిన బాణము ఆయనది. ఆ బాణము నీవద్ద చాలసేపు ఉండబోదు (12). ఓ తాపసా! నీవు తపఃఫలమును వ్యర్థము చేసుకొనుటకు ఏల యత్నించుచున్నావు? ఇతరుల సొత్తును అపహరించుట, మోసముచే ఇతరుల పీడించుట, గర్వించియుండుట మరియు సత్యమును విడనాడుట (13) అను వాటిచే తపస్సు క్షీణమగునని నేను వినియున్నాను. ఇది యథార్థము. కావున ఇపుడు నీ

తపస్సునకు ఏమి ఫలము లభించును? (14) నీవు ఆ బాణమును తీసుకున్నచో తపఃఫలమునుండి వంచితుడై కృతఘ్నుడవు కాగలవు. ఆ బాణము నా స్వామిది మాత్రమే యగును. ఆయన నిన్ను రక్షించుట కొరకై దానిని ప్రయోగించినాడు. ఇదినిశ్చయము (15). ఆయన ఈ బాణముతో శత్రువును సంహరించుట మాత్రమే గాక, బాణము కూడ భద్రముగనుండు నట్లు చేసినాడు. నీవు మిక్కిలి కృతఘ్నుడవు. మరియు నీవు తపస్సును చేయుచూ అశుభము నాచరించుచున్నావు (16). నీవుసత్యమును పలుకుట లేదు. ఈ తపస్సు వలన నీవు ఎట్టి సిద్ధిని కోరుచున్నావు? నీకీ బాణముతో పని యున్నచో, మా ప్రభువును యాచించుము (17). ఆయన ఇట్టి అనేక బాణములను నీకు స్వయముగా ఈయ సమర్థుడు. మా ప్రభువు ఇపుడు ఇచటనే యున్నాడు. నీవు ఇట్లు నన్ను యాచించుటకు కారణమేమి? (18). నీవు ఉపకారమును విడనాడి అపకారమును చేయ గోరుచున్నావు. నీవీనాడు చేయ బూనిన పని యోగ్యమైనది కాదు. ఈ చాపల్యమును విడనాడుము (19). ఆతని ఈ మాటలను విని అపుడు కుంతీపుత్రుడగు అర్జునుడు కోపించి శివుని స్మరించి, తరువాత మితముగా నిట్లు పలికెను (20).

అర్జున ఉవాచ |

శృణు భిల్ల ప్రవక్ష్యామి న సత్యం తవ భాషణమ్ | యథా జాతిస్తథా త్వాం చ జానామి హి వనేచర || 21

అహం రాజా భవాన్ చౌరః కథం యుద్ధప్రయుక్తతా | యుద్ధం మే సబలైః కార్యం నాధమైర్హి కదాచన || 22

తస్మాత్తే చ తథా స్వామీ భవిష్యతి భవాదృశః | దాతారశ్చ వయం ప్రోక్తాశ్చౌరా యూయం వనేచరాః || 23

కథం యాచ్యో మయా భిల్లరాజ ఏవం చ సాంప్రతమ్ | త్వమేవ యాచసే నైవ బాణం మాం కిం వనేచర || 24

దదామి తే తథా బాణాన్ సంతి మే బహువో ధ్రువమ్ | రాజా చ గ్రహణం చైవ న దాస్యతి తథా భ##వేత్ || 25

కిం పునశ్చ తథా బాణాన్ ప్రయచ్ఛామి వనేచర | యది మే యా చికీర్షా స్యాత్కథం నాగమ్యతే%ధునా || 26

యయాగచ్ఛత్తు తే భర్తా కిమర్థం భాషతే%ధునా | ఆగత్య చ మయా సార్ధం జిత్వా యుద్ధే చ మాం పునః || 27

నీత్వా బాణమిమం భిల్ల స్వామీ తే వాహినీ పతిః | నిజాలయం సుఖం యాతు విలంబః క్రియతే కథమ్ || 28

అర్జునుడిట్లు పలికెను-

ఓ భిల్లా! చెప్పెదను వినుము. నీ వచనములు సత్యదూరములు. ఓ వనేచరా! నీవు నీ జాతికి తగినట్లు ప్రవర్తించుచున్నావు. నీ స్వభావమును నేను ఎరింగితిని (21). నేను రాజును. నీవు చోరుడవు. నేను నీతో యుద్ధమును చేయుట ఎట్లు ఘటిల్లును? నేను బలవంతులతో మాత్రమే యుద్ధమును చేసెదను. అధములతో ఎన్నడైననూ చేయను (22). నీ ప్రభువు కూడ నీవంటి వాడే అగును కాబోలు! మేము దాతలమని చెప్పబడినది. వనచరులగు మీరు చోరులు (23). ఇపుడు నేను భిల్లరాజును ఏమని యాచించ వలెను? ఓ వనే చరా! నీవే నన్ను బాణము కొరకు యాచించుట లేదా? (24). మరియు నేను నీకు బాణముల నిచ్చెదను. నా వద్ద నిశ్చయముగా చాల బాణములు గలవు. రాజు వస్తువులను ఇచ్చునే గాని ఎన్నడునూ తీసుకొనడు (25). ఓ వనేచరా! ఈ ఒక్క బాణమేల? ఇంకనూ అనేక బాణముల నిచ్చెదను. కానీ నీ ప్రభువు ఇచటకు రావలయును. నీవు ఇంకనూ ఇచటనే ఉన్నావేల? వెళ్లుము. నాతో యుద్ధమును చేయు కోరిక నీ ప్రభువునకు ఉండునా? నీవు ఇచట బహువచనములనేల పలుకుచున్నావు? నీ ప్రభువు ఇచటకు వచ్చి యుద్ధములో నన్ను జయించవలెను (26, 27). ఆ పైన సైన్యాధ్యక్షుడగు నీ భిల్ల ప్రభువు ఈ బాణమును స్వీకరించి సుఖముగా తన ఇంటికి వెళ్లదగును. నీవింకనూ విలంబము చేయుచున్నావేమి? (28)

నందీశ్వర ఉవాచ |

మహేశ్వర కృపాప్రాప్త సద్బల స్యార్జునస్య హి | ఇత్యేతద్వచనం శ్రుత్వా భిల్లో వాక్య మథా బ్రవీత్ || 29

నందీశ్వరుడిట్లు పలికెను-

మహేశ్వరుని అనుగ్రహముచే పొందబడిన గొప్ప బలముగల అర్జునుని ఈ మాటను విని, తరువాత భిల్లుడిట్లు పలికెను (29).

భిల్ల ఉవాచ |

అజ్ఞో%సి త్వం ఋషిర్నాసి మరణం త్వీహసే కథమ్ | దేహి బాణం సుఖం తిష్ఠ త్వన్యథా క్లేశభాగ్భవేః || 30

భిల్లుడిట్లు పలికెను-

నీవు అజ్ఞానివి. నీవు ఋషివి కావు. నీవు మరణమునేల కోరుచున్నావు? బాణమునిచ్చి సుఖముగా నుండుము. లేనిచో కష్టముల పాలగుదువు (30).

నందీశ్వర ఉవాచ |

ఇత్యుక్తస్తేన భిల్లేన శివసచ్ఛక్తి శోభినా | గణ   న పాండవస్తం చ ప్రాహ స్మృత్వా చ శంకరమ్ || 31

నందీశ్వరుడిట్లు పలికెను-

శివుని గొప్ప శక్తిచే ప్రకాశించే ఆ బిల్లుడిట్లు పలుకగా, అర్జునుడు శంకురుని స్మరించి భిల్లరూపములోనున్న ఆ గణాధ్యక్షునితో నిట్లనెను (31).

అర్జున ఉవాచ |

మద్వాక్యం త్త్వతో భిల్ల శృణు త్వం చ వనేచర | ఆగమిష్యతి తే స్వామీ దర్శయిష్యే ఫలం తదా || 32

న శోభ##తే త్వయా యుద్ధం కరిష్యే స్వామినా తవ | ఉపహాసకరం జ్ఞేయం యుద్ధం సింహ శృగాలయోః || 33

శ్రుతం చ మద్వచస్తే% ద్య్రద్రక్ష్యసి త్వం మహాబలమ్ | గచ్ఛ స్వ స్వామినం భిల్ల యథేచ్ఛసి తథా కురు || 34

అర్జునుడిట్లు పలికెను-

ఓ భిల్లా! వనచరా! నా వాక్యమును విని సారమును గ్రహించుము. నీ ప్రభువు రాగానే, నీ ఈ మాటల ఫలమును అప్పుడు చూపించెదను (32). నేను నీతో యుద్ధమును చేయుట శోభిల్లదు. నీ ప్రభువుతో యుద్ధమును చేసెదను. సింహమునకు, నక్కకు మధ్యలో యుద్ధము అపహాస్యము పాలగును (33). నీవు నా పలుకులనిప్పుడు వినియున్నావు. నా గొప్ప బలమును చూడగలవు. ఓయి బిల్లా! నీ ప్రభువు వద్దకు పొమ్ము. నీకు నచ్చిన విధముగా చేసుకొనుము (34).

నందీశ్వర ఉవాచ |

ఇత్యుక్తస్తు గతస్తత్ర భిల్లః పార్థేన వై మునే | శివావతారో యత్రాస్తే కిదాతో వాహినీ పతిః || 35

అథార్జునస్య వచనం భిల్లరాజాయ విస్తరాత్ | సర్వం నివేదయామాస తసై#్మ భిల్ల పరాత్మనే || 36

స కిరాతేశ్వర శ్ర్శుత్వా తద్వచో హర్షమాగతః | ఆ జగామ స్వసైన్యేన శంకరో భిల్ల రూపధృక్ || 37

అర్జునశ్చ తదా సేనాం కిరాతస్య చ పాండవః || దృష్ట్వా గృహీత్వా సశరం ధనుస్సమ్ముఖ ఆయ¸° || 38

అథో కిరాతశ్చ పునః ప్రేషయామాస తం చరమ్ | తన్ముఖేన జగౌ వాక్యం భారతాయ మహాత్మనే || 39

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మహర్షీ! అర్జునుడిట్లు పలుకగానే ఆ భిల్లుడు సైన్యాధ్యక్షుడగు కిరాతుని రూపములో శివుడు అవతరించియున్న స్థలమునకు వెళ్లెను (35). అపుడాతడు భిల్లరాజు రూపములో నున్న పరమాత్మకు అర్జునుని వచనములన్నిటినీ విస్తరముగా చెప్పెను (36). ఆ కిరాతప్రభువు ఆ మాటలను విని అనందమును పొందెను. భిల్లరూపములో నున్న శంకరుడు తన సైన్యమును దోడ్కొని అచటకు విచ్చేసెను (37). పాండు పుత్రుడగు అర్జునునడపుడు కిరాతుని సేనను గాంచి ధనుర్బాణములను చేతబట్టి ఎదురేగెను (38). అపుడు కిరాతరాజు మరల ఆ సేవకుని భరతవంశజుడు, మహాత్ముడునగు అర్జునుని వద్దకు పంపించి, అతని ముఖము ద్వారా ఈ వాక్యములను చెప్పించెను (39).

కిరాత ఉవాచ |

పశ్య సైన్యం తపస్వింస్త్వం ముంచ బాణం వ్రజాధునా | మరణం స్వల్ప కార్యార్థం కథమిచ్ఛసి సాంప్రతమ్ || 40

భ్రాతరస్తవ దుఃఖార్తాః కలత్రం చ తతః పరమ్ | పృథివీ హస్తతస్తే%ద్య యాస్య తీతి మతిర్మమ || 41

కిరాతుడిట్లు పలికెను-

ఓ తపస్వీ! నీ వీ సైన్యమును చూడుము. బాణమును విడిచిపెట్టి ఇప్పుడే వెళ్లిపొమ్ము. చిన్న పని కొరకు ఇపుడు మరణమునే కోరెదవు? (40). నీ సోదరులు దుఃఖముచే పీడింపబడెదురు. నీ బార్య అంతకంటె అధికముగా దుఃఖితురాలగును. నీవు అట్లు చేయనిచో రాజ్యభ్రష్టుడవగుదువని నాకు తోచుచున్నది (41).

నందీశ్వర ఉవాచ |

ఇత్యుక్తం పరమేశేన పార్థదార్ఢ్య పరీక్షయా | సర్వథార్జున రక్షార్థం ధృతరూపేణ శంభునా || 42

ఇత్యుక్తస్తు తదాగత్య సగణ శ్శంకరస్య తత్ | విస్తరాద్వృత్తమఖిల మర్జునాయ న్యవేదయత్ || 43

తచ్ఛ్రుత్వా తు పునః ప్రాహ పార్థస్తం దూతమాగతమ్ | వాహినీ
పతయే వాచ్యం విపరీతం భవిష్యతి || 44

యద్యహం చైవ తే బాణం యచ్ఛామి చ మదీయకమ్ | కులస్య
దూషణం చాహం భవిష్యామి న సంశయః || 45

భ్రాతరశ్చైవ దుఃఖార్తా భవంతు చ తథా ధ్రువమ్ | విద్యాశ్చ
నిష్ఫలా మే స్యు స్తస్మాదాగచ్ఛ వై ధ్రువమ్ || 46

సింహశ్చైవ శృగాలద్వా భీతో నైవ మమా శ్రుతః తథా వనే చరా
ద్రాజా న బిభేతి కదాచన || 47

ఇత్యుక్తస్తం పునర్గత్వా స్వామినం పాండవేన సః | సర్వం
నివేదయామాస తదుక్తం హి విశేషతః || 48

అథ సో %పి కిరాతాహ్వో మహాదేవస్సుసైన్యకః | తచ్ఛ్రుత్వా
సైన్యసంయుక్తో హ్యర్జునం చాగమత్తదా || 49

ఇతి శ్రీ శివమహాపురాణ    శతరుద్రసంహితాయా కిరాతార్జున
సంవాదో నామ చత్వారింశో% ధ్యాయః (40).

నందీశ్వరుడిట్లు పలికెను-

అన్ని విధములుగా అర్జునుని రక్షించుటకై అవతరించిన పరమేశ్వరుడగు శంభుడు పార్థుని దృఢదీక్షను పరీక్షించుటకై ఇట్లుపలికెను (42). శంకరుడిట్లు చెప్పగానే శంకరుని అనుచరుడు అర్జునుని వద్దకు వచ్చి ఆ వివరములనన్నిటినీ ఆతనికి విన్నవించెను (43). ఆ సందేశమును విని అర్జునుడు తన వద్దకు వచ్చిన దూతతో మరల ఇట్లనెను: మీ సేనాధ్యక్షునకు చెప్పుము అంతా విపరీతము కాగలదు (44). నేను నీకు నా బాణము నిచ్చినచో, నేను నా కులమును చెడగొట్టిన వాడనగుదును దీనిలో సందేహము లేదు (45). నా సోదరులు దుఃఖపీడితులైనచో అగుదురు గాక! కాని నా విద్యలు వ్యర్థమగుట నాకు సమ్మతము కాదు ఇది నిశ్చయము. కావున రమ్ము (46). సింహము నక్కవలన ఎన్నడైననూ భయపడదని నేను వినియున్నాను. అదే విధముగా

రాజు వనచరుని వలన ఎన్నటికీ భయపడడు (47). అర్జునుడిట్లు పలుకగా ఆ అనుచరుడు మరల తన ప్రభువు వద్దకు వెళ్లి అర్జునుని వచనములను జాగరూకతతో సర్వమును విన్నవించెను (48). అపుడు కిరాతరూపములో నున్న మహాదేవుడు ఆ మాటలను విని తన సైన్యముతో గూడి అర్జునునిపై దండెత్తెను. (49).

శ్రీ శివమహాపురాణములోని శతరుద్రసంహితయందు కిరాతార్జున సంవాదమనే నలుబదియవ అధ్యాయము ముగిసినది (40).